# శ్రీ షష్ఠీదేవి వ్రతకల్పము

## గర్భిణీస్త్రీలు ప్రతిఒక్కరూ ఆచరించవలసిన మహిమాన్విత వ్రతము



శ్రీరస్తు　　　　శుభమస్తు　　　　అవిఘ్నమస్తు

# శ్రీ షష్ఠీ దేవి వ్రత కల్పము

పూజావిధానము, స్తోత్రములతో....



విషయ సేకరణ, కూర్పు : గాజుల సత్యనారాయణ

వెల : 20-00


• విజేత బుక్స్ •



డోర్ నెం. 24-14-45, సాయి రెసిడెన్సీ, 2వ అంతస్తు,
కుందేటి వారి వీధి, దుర్గాపురం, విజయవాడ - 3
చలనవాణి : 9848687652



# మా మాట

లక్ష్మీదేవి సంపద నిచ్చే దేవత అయితే భౌతిక అంశాలను అందించే అధిదేవత శ్రీ షష్ఠీదేవి. ఈ ప్రకృతి భౌతిక అంశాల్లో ఆరవ వంతు ఆమెది. ఆరోవంతు భాగం కల్గినది కాబట్టి ఈమెను షష్ఠి అని పిలిచారు. షష్ఠిదేవికి పిల్లలంటే మహాఇష్టం. నిజానికి ఆమె బాలల సంక్షేమ దేవత. ఆమె దీవెనలు, వరాలం దించే ఒక అతి సుందరమైన యవ్వన దేవత అని పురాతన గ్రంథాలు చెప్తున్నాయి. ఘనమైన కీర్తి కలిగి, ఒంటినిండా ఆభరణాలు ధరించి, ఎప్పుడూ వెలుగులు విరజిమ్ముతూ ఉంటుంది. బంగారు మేనిఛాయలో మెరిసి పోయే షష్టీదేవి ఇతర దేవతల కంటే చాలా భిన్నంగా ఉంటుంది. ఎప్పుడూ చేతిలో పిల్లలతో, తన వాహనమైన పిల్లితో దర్శనమిస్తుంది.

పురాణాలలోనూ, జానపద గాథలలోనూ షష్టీ దేవి లీలల గురించి ఎన్నో గాథలు వినిపిస్తూ ఉంటాయి. దేవి భాగవతం తొమ్మిదవ స్కందంలో ఈ షష్ఠీదేవి ప్రస్తావన, చరిత్ర ఉన్నది. ఈమెకు మరొక పేరు దేవసేన. కుమారస్వామి వారి దేవేరి. ఈమె బాలారిష్టముల నుండి శిశువులను రక్షిస్తుంది. అందుకే నిన్నమొన్నటి వరకూ ఉత్తరాదిన ఒడిషా, బెంగాల్ వంటి ప్రాంతాలలో మాత్రమే ఉన్న షష్టీ దేవి ఆరాధన నిదానంగా ఇప్పుడు దక్షిణాదిన కూడా గొప్ప ప్రాచుర్యం పొందుతోంది.

సంతానం కలగగానే తొలిగా పూజించేది షష్ఠి దేవి అమ్మవారినే. ప్రసవమైన గదిలో ప్రసవించిన ఆరవ రోజున నిర్వహించే పూజా కార్యక్రమాలు ఈమెకే చెందుతాయి. నేను జన్మనిచ్చినా బిడ్డకు అసలు తల్లివి నీవే, నీ చల్లని చూపులతో నా బిడ్డను చల్లగా చూడు తల్లీ అని షష్ఠి దేవతకు పూజ చేసి నైవేద్యం పెడతారు పసిబిడ్డల తల్లులు. ఈమెకు సంబంధించిన కథ చదివినా, వినినా, సుఖ సంపదలతో పాటు పుత్రపౌత్రాభివృద్ధి కలుగుతుంది. ముఖ్యముగా గర్భముతో వున్న స్త్రీమూర్తులు ఈ తల్లి చరిత్ర స్తోత్రము, మంత్రము, రోజు చదువుట వలన ఆ తల్లికి పుట్టబోయే బిడ్డ ఆయురారోగ్యాలతో పాటూ, మంచి నడవడితో పెరిగి పెద్దల మన్ననలను పొందుతారు.

– పబ్లిషర్స్



# శ్రీ షష్ఠీ దేవి వ్రత విధానము

ప్రకృతిమాత, సంతానప్రదాయిని అయిన శ్రీ షష్టీదేవిని భక్తి శ్రద్ధలతో పూజించుటకు ముందుగా పూజా స్థలమును ఆవుపేడతో శుద్ధిపరిచి శ్రీ వల్లీ దేవసేనా సమేత శ్రీ సుబ్రహ్మణ్య స్వామి వార్ల చిత్ర పటమును, కలశమును ఉంచి ముందుగా విఘ్నాలు తొలగుటకు పసుపు గణపతి పూజా తరువాత శ్రీ షష్టీ దేవి పూజా కార్యక్రమము జరుపవలెను.

## శ్రీ గణపతి పూజ

**శ్లో॥ అగమార్థంతు దేవానాం గమనార్థంతు రాక్షసాం ।**
**కురు ఘంటారవం తత్ర దేవతాహ్వాన లాంఛనం ॥**

పై శ్లోకం చదువుతూ ఘంటానాదం చేయవలెను.

ఆచమనం చేసిన తరువాత దీపారాధన కుందికి పసుపు కుంకుమలతో అలంకరించి ఈ క్రింది శ్లోకం చదివి నమస్కరించవలెను.

**శ్లో॥ దీపం జ్యోతి పరంబ్రహ్మ దీపం సర్వతమోపహం ।**
**దీపేన సాధ్యతే సర్వం సంధ్యాదీపం నమోస్తుతే ॥**

అని పసుపు గణపతికి నమస్కరించి గణపతి పూజ చేయవలెను.

**ఆచమనం :** ఓం కేశవాయ స్వాహా, ఓం నారాయణాయ స్వాహా, ఓం మాధవాయ స్వాహా । స్త్రీలైతే కేశవాయ నమః, నారాయణాయ నమః, మాధవాయ నమః అని చెప్పాలి.

ఓం గోవిందాయ నమః, ఓం విష్ణవే నమః, ఓం మధుసూదనాయ నమః, ఓం త్రివిక్రమాయ నమః, ఓం వామనాయ నమః, ఓం శ్రీధరాయ నమః, ఓం హృషీకేశాయ నమః, ఓం పద్మనాభాయ నమః, ఓం దామోదరాయ నమః, ఓం సంకర్షణాయ నమః, ఓం వాసుదేవాయ నమః, ఓం ప్రద్యుమ్నాయ నమః, ఓం అనిరుద్ధాయ నమః, ఓం పురుషోత్తమాయ నమః, ఓం అథోక్షజాయ నమః, ఓం నారసింహాయ నమః, ఓం అచ్యుతాయ నమః, ఓం జనార్ధనాయ నమః, ఓం ఉపేంద్రాయ నమః, ఓం హరాయ నమః, ఓం శ్రీకృష్ణాయ నమః.

**ఉత్తిష్ఠంతు భూతపిశాచాః, ఏతేభూమిభారకాః, ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే.** (అని అక్షతలు వాసన చూచి వెనుకకు వేసుకోవలెను)

(కుడిచేతి బొటన, మధ్య, అనామిక, వేళ్ళతో ముక్కు పట్టుకొని శ్వాసపీల్చి వదులుతూ, అనగా ప్రాణాయామము చేస్తూ ఈ క్రింది మంత్రము చదువవలెను) **ఓం భూః, ఓం భువః, ఓగ్ం సువః, ఓం మహః, ఓం జనః ఓం తపః, ఓగ్ం సత్యం, ఓం తత్స వితుర్వరేణ్యం, భర్గోదేవస్య ధీమహి, ధియోయోనః ప్రచోదయాత్, ఓమాపోజ్యోతీరసోఽ మృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్.**

మమఉపాత్త, సమస్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభన ముహూర్తే శ్రీ మహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేత వరాహకల్పే, వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోర్దక్షిణదిగ్భాగే, శ్రీశైలస్య... ప్రదేశే... మధ్యేదేశే స్వగృహే/వసతి గృహే సమస్త దేవతా బ్రాహ్మణ హరిహర గురుచరణ దైవసన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన..... సంవత్సరే .... ఆయనే... ఋతౌ... మాసే... పక్షే.... తిథౌ.... వాసరే శుభనక్షత్రే శుభయోగే, శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ, శ్రీమాన్.... గోత్రః ..... నామధేయః ధర్మపత్నీ సమేతః శ్రీమతః...... గోత్రస్య..... నామధేయస్య మమోపాత్త దురితక్షయద్వారా అస్మాకం సహకుటుంబానాం క్షేమస్థైర్య ధైర్య విజయా అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం సత్ సంతాన సౌభాగ్య వృద్ధ్యర్థం శ్రీ షష్ఠీదేవీ దేవతా ముద్దిశ్య శ్రీ షష్ఠీదేవీ దేవతా ప్రీత్యర్థం యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే, (ఉదకాన్ని తాకాలి) తదంగ కలశారాధనం కరిష్యే ఉదకమును తాకవలెను.





## కలశం గంధపుష్పాక్షతైరభ్యర్చ్య

పంచపాత్రకు మూడుచోట్ల చందనము, కుంకుమ బొట్లు పెట్టి అలంకరించాలి. తరువాత ఆ పాత్రలో అక్షతలు తమలపాకు, తులసిదళము, పుష్పము ఉంచవలెను) చెంబుపై చేయి ఉంచి ఈ క్రింది మంత్రములు పఠించవలెను.

## కలశపూజ

**కలశస్యముఖేవిష్ణుః కంఠేరుద్రస్సమాశ్రితః ।**
**మూలేతత్రస్థితో బ్రహ్మామధ్యే మాతృ గణాస్మృతాః ।**
**కుక్షౌతుసాగరా స్సర్వే సప్తద్వీపా వసుంధరా ॥**
**ఋగ్వేదోఽథయజుర్వేదస్సామవేదో హ్యథర్వణః**
**అంగైశ్చ సహితా స్సర్వే కలశాంబు సమాశ్రితాః ॥**

(అని చదువుతూ కలశంలో ఉన్న ఉదకమును అభిమంత్రించవలెను)

**ఆకలశేషు ధావతి పవిత్రే పరిషిచ్యతే ఉక్థైర్యజ్ఞేషువర్ధతే । ఆపోవాఇదగ్ం సర్వం విశ్వాభూతా న్యాపః, ప్రాణావా ఆపః పశవ ఆపోఽన్న మాపోఽమృతమాప స్సమ్రాడాపో విరాడాప స్స్వరాడాప శ్ఛందాగ్ం ష్యాపో జ్యోతీగ్ంష్యాపో యజూగ్ంష్యాప స్సత్యమాపస్సర్వాదేవతా అపోభూర్భువస్సువరాప ఓం ।**

**గంగే చ యమునే కృష్ణే గోదావరి సరస్వతి, నర్మదేసింధు కావేరి జలేఽస్మిన్ సన్నిధింకురు, అయాంతు శ్రీషష్ఠీ దేవతా పూజార్థం మమ దురితక్షయ కారకాః. కలశోదకేన పూజా ద్రవ్యాణి సంప్రోక్ష్య, దేవం ఆత్మానం చ సంప్రోక్ష్య** (పుష్పంతో గాని, తమలపాకుతో గాని కలశములోని నీటిని పూజా ద్రవ్యముల మీదను, దేవి పాదాల వద్దను తనమీదను చల్లుకోవలెను.)

**ఆదౌనిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే.** అని (ఉదకము తాకవలెను)

(పసుపు గణపతిని తమలపాకులో పెట్టి గణపతిని సర్వ విఘ్నములు తొలిగి, సమస్త శుభాలకోసం శాంతికోసం పూజించాలి.

ఓం ఆసునీతే పునరస్మానుచక్షుః పునః ప్రాణమిహానోధేహి భోగం జ్యోక్పశ్యేమసూర్య ముచ్చరంత మనుమతే మృదయాన స్స్వస్తి అమృతం వైప్రాణా అమృత మాపః ప్రాణానేవ యథాస్థానము పహ్వాయతే, స్థిరోభవ, వరదోభవ, సుముఖోభవ, సుప్రసన్నో భవ స్థిరాసనం కురు. ఓం శ్రీ మహాగణాధిపతయే నమః ప్రాణ ప్రతిష్ఠాపన ముహూర్త స్సుముహూర్తోఽస్తు. శ్రీ మహాగణాధిపతి ఆవాహయామి స్థాపయామి పూజయామి. (గణపతి ముందు అక్షింతలు ఉంచవలెను)

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే ॥



ఓం శ్రీ మహాగణాధిపతయే నమః ధ్యాయామి (అని పసుపుతో చేసిన అక్షతలు విఘ్నేశ్వరుని ప్రతిమ ముందు ఉంచవలెను)

శ్రీ మహాగణాధిపతయే నమః ఆవాహయామి,
శ్రీ మహాగణాధిపతయే నమః సువర్ణ రత్నఖచిత సింహాసనం సమర్పయామి
శ్రీ మహాగణాధిపతయే నమః పాదయోః పాద్యం సమర్పయామి
శ్రీ మహాగణాధిపతయే నమః హస్తయోఅర్ఘ్యం సమర్పయామి
శ్రీ మహాగణాధిపతయే నమః ముఖే ఆచమనీయం సమర్పయామి
శ్రీ మహాగణాధిపతయే నమః మధుపర్కం సమర్పయామి
శ్రీ మహాగణాధిపతయే నమః శుద్ధోదక స్నానం సమర్పయామి
శ్రీ మహాగణాధిపతయే నమః స్నానానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి ।
శ్రీ మహాగణాధిపతయే నమః వస్త్రయుగ్మం సమర్పయామి
శ్రీ మహాగణాధిపతయే నమః యజ్ఞోపవీతం సమర్పయామి
శ్రీ మహాగణాధిపతయే నమః దివ్య శ్రీచందనం సమర్పయామి

శ్రీ మహాగణాధిపతయే నమః గంధస్యోపరి అలంకారార్థం అక్షతాన్ సమర్పయామి।

శ్రీ మహాగణాధిపతయే నమః పుష్పాణి పూజయామి.

ఓం సుముఖాయ నమః, ఓం ఏకదంతాయ నమః, ఓం కపిలాయ నమః, ఓం గజకర్ణికాయ నమః, ఓం లంబోదరాయ నమః, ఓం వికటాయ నమః, ఓం విఘ్నరాజాయ నమః, ఓం గణాధిపాయ నమః, ఓం ధూమకేతవే నమః, ఓం గణాధ్యక్షాయ నమః, ఓం ఫాలచంద్రాయ నమః, ఓం గజాననాయ నమః, ఓం వక్రతుండాయ నమః, ఓం శూర్పకర్ణాయ నమః, ఓం హేరంభాయ నమః, ఓం స్కందపూర్వజాయ నమః। ఓం సర్వసిద్ధి ప్రదాయ

శ్రీ మహాగణాధిపతయే నమః షోడశనామ పూజాం సమర్పయామి

శ్రీ మహాగణాధిపతయే నమః ధూపమాఘ్రాపయామి

శ్రీ మహాగణాధిపతయే నమః సాక్షాద్దీపం దర్శయామి।

శ్రీ మహాగణాధిపతయే నమః ధూపదీపానంతరం ఆచమనీయం సమర్పయామి।

శ్రీ మహాగణాధిపతయే నమః నైవేద్యం సమర్పయామి। (బెల్లం ముక్క పెట్టవలెను)

ఉపనయనం అయిన మగవారు మాత్రమే ఈ క్రింది గాయత్రీ మంత్రము తోను, మిగిలినవారు శ్లోకంతోను నివేదను చేయవలెను.

**ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్** । (ఈ మంత్రము చదువుచు నైవేద్యముపై నీరు చల్లవలెను) (పగటి భాగమయితే) **సత్యంత్వర్తేన పరిషించామి** అనియు (రాత్రి భాగమయితే) **ఋతంత్వాసత్యేన పరిషించామి** అని చెప్పి చేతిలో నీరు పోసికొని నైవేద్యము చుట్టు త్రిప్పవలెను)

ఓం ప్రాణాయ స్వాహా, ఓం అపానాయ స్వాహా, ఓం వ్యానాయ స్వాహా, ఓం ఉదానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా అనుచూ అక్కడ ఉన్న పదార్థములను స్వామికి చూపవలెను. మధ్యే మధ్యే పానీయం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి, శుద్ధాచమనీయం సమర్పయామి. (పుష్పంతో నీరు చల్లవలెను)

శ్రీ మహాగణాధిపతయే నమః తాంబూలం సమర్పయామి. తాంబూల చర్వణానంతరం ఆచమనీయం సమర్పయామి. (పుష్పముతో నీరు చల్లవలెను) శ్రీ మహాగణాధిపతయే నమః నీరాజనం దర్శయామి, నీరాజనానంతరం ఆచమనీయం సమర్పయామి.

## మంత్రపుష్పం

**సుముఖశ్చైకదంతశ్చ కపిలోగజకర్ణకః**
**లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః**
**ధూమకేతు ర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః**
**వక్రతుండ శ్శూర్పకర్ణో హేరంబః స్కంద పూర్వజః**
**షోడశైతానినామాని యఃపఠేత్ శృణుయాదపి**
**విద్యారంభే వివాహే చ ప్రవేశేనిర్గమే తథా**
**సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్యనజాయతే**

ఓం శ్రీ మహాగణపతయే నమః సువర్ణదివ్య మంత్రపుష్పం సమర్పయామి (అక్షతలు పుష్పములు స్వామి వద్ద పెట్టవలెను.)

**యానికానిచపాపాని జన్మాంతర కృతానిచ ।**
**తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణం పదేపదే**
పాపోఽహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః
పాపాహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవా (స్త్రీలైతే)
**అన్యథాశరణం నాస్తి త్వమేవ శరణంమమ**
**తస్మాత్కారుణ్య భావేన రక్షరక్ష గణాధిప.**

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. (స్వామి ముందు అక్షతలు వేయవలెను)

యస్యస్మృత్యాచ నామోక్త్యా తపః పూజా క్రియాదిషు ।
న్యూనం సంపూర్ణ తాం యాతిసద్యో వందేతమచ్యుతం ।

మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం గణాధిప,
యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తుతే,

అనయాధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజయా చ భగవాన్ సర్వాత్మకః శ్రీ మహాగణాధిపతిః సుప్రీతస్సుప్రసన్నో వరదోభవతు. ఉత్తరే కర్మణ్యావిఘ్నమస్తు. (అక్షతలు నీరు కలిపి స్వామి ముందు విడువవలెను)

వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ ।
అవిఘ్నం కురుమే దేవ సర్వకార్యేషు సర్వదా ॥



ఓం శ్రీ మహాగణాధిపతి ప్రసాదం శిరసా గృహ్ణామి (అని స్వామి వారి వద్ద ఉన్న అక్షతలు, పుష్పములు తీసి తలపై ధరించవలెను)

## ఉద్వాసన

యజ్ఞేనయజ్ఞ మయజంతదేవాః తానిధర్మాని ప్రధమాన్యాసన్ ।
తేహనాకం మహిమాన స్సచంతే యత్రపూర్వే సాధ్యాస్సంతిదేవాః

ఓం శ్రీ మహాగణపతిం యధాస్థానం ప్రవేశయామి. శోభనార్థం పునరాగమ నాయచ. (అని పసుపు గణపతిని తూర్పుకు కదల్చవలెను) ఈ విధముగా ప్రతి వ్రతమునకు ముందుగా పసుపు గణపతిని పూజించవలయును.





పసుపు గణపతి పూజ చేసిన తరువాత మరల ఆచమనము చేసి సంకల్పము చెప్పుకొని పూజ ప్రారంభించవలెను.

**ఆచమనం :** ఓం కేశవాయ స్వాహా, ఓం నారాయణాయ స్వాహా, ఓం మాధవాయస్వాహా (స్త్రీలు అయితే ఓం కేశవాయ నమః, ఓం నారాయణాయ నమః, ఓం మాధవాయ నమః అని చెప్పవలెను.)

**దేవేసి భక్తసులభే సర్వశక్తి సమన్వితే ।**
**యావత్వాం పూజయిష్యామి తావత్వం సుస్థిరాభవ ॥**

శ్రీ షష్ఠీ దేవీ సాంగం సాయుధం సపతి పుత్ర పరివార సమేతం శ్రీ షష్ఠీ దేవీ ఆవాహయామి స్థాపయామి పూజయామి ॥

దేవుని ముందు ఉన్న పుష్పాన్ని చేతితో తీసికొని ఈ క్రింది మంత్రము చెప్పవలెను.



**అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణమిహనో దేహిభోగం**
**జ్యోక్ప శ్యేమ సూర్య ముచ్చరంత మనుమతె మృడయాన స్వస్తి ।**
**అమృతం వై ప్రాణా అమృతమాపః ప్రాణానేవ యథాస్థానముపహ్వయతే**
**స్థిరోభవ వరదోభవ సుముఖోభవ సుప్రసన్నోభవ స్థిరాసనం కురు ॥**

**ధ్యానమ్ :** ఓం సృష్టిస్థితి వినాశనం శక్తి భూతే సనాతని ।
గుణాశ్రయే గుణమయే షష్టీదేవ్యై నమోస్తుతే ॥

ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః ధ్యాయామి. (నమస్కరించవలెను)

**ఆవాహనం :** సర్వమంగళమాంగళ్యే షష్టీదేవ్యై నమోస్తుతే ।
ఆవాహయామి దేవి త్వాం సుప్రీతా భవ సర్వదా ॥

ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః, ఆవాహయామి. (అక్షతలు వేయవలెను)

**సింహాసనం :** సూర్యాయుతనిభస్ఫూర్తే స్ఫురద్రత్న విభూషితం ।
సింహాసనమిదం దేవి స్థీయతాం సురపూజితే ॥

ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః నవరత్నఖచిత హేమ సింహాసనం సమర్పయామి.

**పాద్యం :** శుద్ధోదకం చ పాత్రస్థం గంధ పుష్పాదిమిశ్రితం ।
అర్ఘ్యం దాస్యామి తే దేవి గృహాణ సురపూజితే ॥

ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః పాదయోః పాద్యం సమర్పయామి.

**అర్ఘ్యం :** సువాసిత జలం రమ్యం సర్వతీర్థ సముద్భవం ।
పాద్యం గృహాణ దేవి త్వం సర్వదేవ నమస్కృతే ॥

ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి.



**ఆచమనం :** సువర్ణ కలశానీతం చందనాగరుసం యుతం ।
గృహాణాచమనం దేవి మయాదత్తం శుభప్రదే ॥

ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః, ముఖే ఆచమనీయం సమర్పయామి.

**మధుపర్కం :** షష్ఠీదేవి నమస్తుభ్యం నమస్తుభ్యం సురేశ్వరి ।
స్కందప్రియే నమస్తుభ్యం నమస్తుభ్యం దయానిధే ॥

ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః, మధుపర్కం సమర్పయామి.

## పంచామృత స్నానం

పంచామృతములనగా ఆవుపాలు, ఆవుపెరుగు, ఆవునెయ్యి, తేనె, చక్కెర (చక్కెర అనగా పటికబెల్లం పొడిచేసి వాడవలెను)

**పురాకల్పక్షయే లోకాన్నిసృష్టుర్మ్యాఢచేతసః ।**
**గుణత్రయమయీ శక్తి ర్మూల ప్రకృతి సంజ్ఞితా ॥**

ఇతి క్షీరేణ స్నపయామి (ఆవుపాలు)

సపన్నగం సాచ్ఛికం చ సశైల వనకాననం ।
సరాశిగ్రహ నక్షత్రం పంచభూత గుణాన్వితమ్ ॥
ఇతి దధ్నాస్నపయామి (ఆవుపెరుగు)

మహావిద్యా జగన్మాతా మహాలక్ష్మి స్కందప్రియా
విష్ణుమాయా శుభాశాంతి సిద్ధా సిద్ధ ప్రదాయినీ
ఇతి ఆజ్యేన స్నపయామి (ఆవునెయ్యి)

సర్వేశ్వరీ చ సత్యాచ సర్వసౌభాగ్యవర్ధిని ।
సంకర్షిణీ మహానిద్రా యోగనిద్రా ప్రభావతి ॥
ఇతి మధునా స్నపయామి (తేనె)

దేవసేనా హేమవతీ గుణత్రయా సురేశ్వరీ ।
సిద్ధిదా బుద్ధిదా నిత్య సత్యమార్గ ప్రబోధినీ ॥
ఇతి శర్కరేణ స్నపయామి (చక్కెర)



పయోదధి ఘృతోపేతం శర్కరామధు సంయుతం ।
పంచామృత మిదం స్నానం గృహాణ సురపూజితే ॥
ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః, పంచామృత స్నానం సమర్పయామి.

చతుర్వర్ణమయీ మూర్తి శ్చతుర్వర్ణైశ్చ పూజితా ।
సర్వధర్మమయీ దేవీ శ్చతురాశ్రమ వాసినీ ॥
ఇతి ఫలోదకేన స్నపయామి

గంగాజలం మయాఽనీతం మహాదేవశిరః స్థితం ।
శుద్ధోదకస్నానమిదం గృహాణ విధుసోదరి ॥
ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః, శుద్ధోదక స్నానం సమర్పయామి.

**వస్త్రం :** సురార్చితాంఘ్రియుగళే దుకూలవసనప్రియే ।
వస్త్రయుగ్మం ప్రదాస్యామి గృహాణ హరివల్లభే ॥
ఓం శ్రీ షష్ఠీదేవ్యై నమః, వస్త్రయుగ్మం సమర్పయామి.

కేయూరకంకణే దివ్యే హారనూపుర మేఖలాః ।
విభూషణాన్యమూల్యాని గృహాణ ఋషిపూజితే ॥
ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః, ఆభరణాని సమర్పయామి.

తప్తహేమ కృతం సూత్రం ముక్తదామ విభూషితం ।
కంఠసూత్ర మిదం దేవి గృహాణత్వం శుభప్రదే ॥
ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః కంఠసూత్రార్థం అక్షతాన్ సమర్పయామి. (అక్షతలు వేయవలెను)

**గంధం :** కర్పూరాగరు కస్తూరీ రోచనాదిభిరన్వితం ।
గంధం దాస్యామ్యహం దేవి ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్ ॥
ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః, దివ్య శ్రీచందనం సమర్పయామి. (గంధం పుష్పముతో చల్లవలెను)

అక్షతాన్ ధవళాన్ దివ్యం శాలీయాం స్తండులాన్ శుభాన్ ।
హరిద్రా కుంకుమోపేతాన్ గృహ్యతామబ్ధిపుత్రికే ॥
ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః, అక్షతాన్ పూజయామి (అక్షతలు వేయవలెను)

సౌభాగ్యసూత్రం వరదే సువర్ణమణి సంయుతే ।
కంఠే బధ్నామి దేవేశి సౌభాగ్యం దేహిమే సదా ॥
ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః, హరిద్రాన్ పూజయామి (పసుపు వేయవలెను)

తప్తకాంచన సంకాశం కోటిసూర్య సమప్రభం ।
కుంకుమం తే మయాదత్తం గృహాణ వరదా భవ ॥
ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః, కుంకుమాన్ పూజయామి (కుంకుమ వేయవలెను)

**పుష్పం: మల్లికాజాజికుసుమై శ్చంపకైర్వకుళైరపి ।**
**శతపత్రైశ్చ కల్హారైః పూజయామి స్కందప్రియే ॥**

ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః, పుష్పాణి పూజయామి. (పుష్పం సమర్పించవలెను)

## అథాంగపూజా

ఓం దేవసేనాయై నమః - పాదౌ పూజయామి
ఓం స్కందప్రియాయై నమః - గుల్ఫౌ పూజయామి
ఓం కాంత్యై నమః - జంఘే పూజయామి
ఓం మహాదేవ్యై నమః - ఊరూ పూజయామి
ఓం కమలిన్యై నమః - కటిం పూజయామి
ఓం స్కందాయై నమః - నాభిం పూజయామి
ఓం క్షమాయై నమః - ఉదరం పూజయామి
ఓం గౌర్యై నమః - హృదయం పూజయామి
ఓం కంబుకంఠ్యై నమః - కంఠం పూజయామి
ఓం సువాసిన్యై నమః - ముఖం పూజయామి
ఓం స్వర్ణకుండలాయై నమః - కర్ణద్వయం పూజయామి
ఓం సుస్వరూపాయై నమః - నాసికాద్వయం పూజయామి
ఓం లోకమాత్రే నమః - లలాటం పూజయామి
ఓం చాముండాయై నమః - శిరః పూజయామి
ఓం యోగనిద్రాయై నమః - పాదుకాం పూజయామి
ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః సర్వాణ్యంగాని పూజయామి

# శ్రీ షష్ఠీదేవీ అష్టోత్తర శతనామావళి

ఓం పీతాంబర్యై నమః
ఓం దేవసేనాయై నమః
ఓం దివ్యాయై నమః
ఓం కరాళిన్యై నమః
ఓం జ్వాలానేత్ర్యై నమః
ఓం మహాలక్ష్మ్యై నమః
ఓం వారాహ్యై నమః
ఓం బ్రహ్మవిద్యాయై నమః
ఓం సరస్వత్యై నమః
ఓం ఉషాయై నమః
ఓం ప్రకృత్యై నమః
ఓం శివాయై నమః
ఓం సర్వాభరణభూషితాయై నమః
ఓం శుభరూపాయై నమః
ఓం శుభకర్యై నమః
ఓం ప్రత్యుషాయై నమః
ఓం ఉత్పలధారిణ్యై నమః
ఓం అణిమాయై నమః
ఓం మహాదేవ్యై నమః
ఓం ప్రవాళవదనాయై నమః
ఓం అనంతాయై నమః
ఓం ఇంద్రాణ్యై నమః
ఓం ఇంద్రరూపిణ్యై నమః
ఓం ఇంద్రశక్త్యై నమః
ఓం పరాయణ్యై నమః
ఓం లోకాధ్యక్షాయై నమః
ఓం సురాధ్యక్షాయై నమః
ఓం ధర్మాధ్యక్షాయై నమః
ఓం సుందర్యై నమః
ఓం స్కందపత్న్యై నమః
ఓం సురాగ్రతాయై నమః
ఓం సుస్వరూపాయై నమః
ఓం మహేశ్వర్యై నమః
ఓం అచింతశక్త్యై నమః
ఓం అక్షోభ్యాయై నమః
ఓం చంద్రవర్ణాయై నమః
ఓం కళాధరాయై నమః
ఓం పూర్ణచంద్రాయై నమః
ఓం సర్వాయై నమః
ఓం యక్షాయై నమః
ఓం ఇష్టసిద్ధిప్రదాయిన్యై నమః
ఓం మాయాధరాయై నమః
ఓం మహామాయిన్యై నమః
ఓం సుస్వరూపాయై నమః

ఓం భోగిన్యై నమః
ఓం పాపనాశిన్యై నమః
ఓం సుఖాసనాయై నమః
ఓం సుఖాకారాయై నమః
ఓం మహోఛత్రాయై నమః
ఓం పురాతన్యై నమః
ఓం వేదాయై నమః
ఓం వేదసారాయై నమః
ఓం వేదగర్భాయై నమః
ఓం త్రయీమయై నమః
ఓం సామ్రాజ్యాయై నమః
ఓం సత్ప్రభాయై నమః
ఓం ఐశ్వర్యదాయిన్యై నమః
ఓం అనింద్యాయై నమః
ఓం బాలారిష్ట దోషనివారిణ్యై నమః
ఓం తుంగభద్రాయై నమః
ఓం ఈశానాయై నమః
ఓం లోకమాత్రే నమః
ఓం ఓజసే నమః
ఓం తేజసే నమః
ఓం అపాపహోయై నమః
ఓం సద్యోజాతాయై నమః
ఓం సనాతనాయై నమః
ఓం బహువర్ణాయై నమః

ఓం గోపవత్యై నమః
ఓం సర్వస్యై నమః
ఓం మంగళకారిణ్యై నమః
ఓం అంబాయై నమః
ఓం గణాంబాయై నమః
ఓం విశ్వాంబాయై నమః
ఓం సుందర్యై నమః
ఓం త్రిపురసుందర్యై నమః
ఓం మనోన్మన్యై నమః
ఓం చాముండాయై నమః
ఓం సుధాకారాయై నమః
ఓం కాంచనాయై నమః
ఓం హేమభూషణాయై నమః
ఓం మూలాధిపాయై నమః
ఓం పరాశక్త్యై నమః
ఓం పుష్కరాయై నమః
ఓం సర్వతోముఖ్యై నమః
ఓం కల్యాణదాయిన్యై నమః
ఓం ఉమాయై నమః
ఓం పార్వత్యై నమః
ఓం విశాలాక్ష్యై నమః
ఓం హేమవత్యై నమః
ఓం అశేష హృదయాయై నమః
ఓం దేవ్యై నమః

ఓం సర్వేశ్వర్యై నమః
ఓం నాయక్యై నమః
ఓం నాగధారిణ్యై నమః
ఓం స్వధాయై నమః
ఓం విశ్వతోముఖ్యై నమః
ఓం సురాధ్యక్షాయై నమః
ఓం సురేశ్వర్యై నమః
ఓం గుణత్రయాయై నమః
ఓం దయారూపిణ్యై నమః
ఓం సంతానప్రదాయిన్యై నమః
ఓం ప్రాణశక్త్యై నమః
ఓం పరాదేవ్యై నమః
ఓం శరణాగత రక్షణాయై నమః
ఓం దేవసేనాయై నమః
ఓం సిద్ధిదాయై నమః
ఓం స్కందప్రియాయై నమః

ఓం శ్రీ షష్ఠీదేవ్యై నమః అష్టోత్తర శతనామ పూజాం సమర్పయామి



## ధూపం

దశాంగం గుగ్గులో పేతం సుగంధ చ మనోహరం ।
ధూపం దాస్యామి దేవేశి మహాలక్ష్మీర్గృహాణతమ్ ॥
ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః, ధూపమాఘ్రాపయామి

**దీపం :** ఘృతవర్తి సంయుక్త మందకార వినాశకం ।
దీపం దాస్యామి తే దేవి గృహాణ ముదితా భవ ॥
ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః, దీపం దర్శయామి.
ధూపదీపానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి. (నీరు వదలవలెను)

**నైవేద్యం :** నైవేద్యం షడ్రసోపేతం దధిమధ్వాజ్యసంయుతం ।
నానాభక్ష్యఫలోపేతం గృహాణ హరివల్లభే ॥
ఉపనయనం అయిన మగవారు క్రింది గాయత్రీ మంత్రముతోను, స్త్రీలు పై శ్లోకంతోను నివేదన చేయాలి.

ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్, (పదార్థములపై నీటిని చల్లవలెను.) సత్యంత్వర్తేన పరిషించామి, (అని పళ్ళెముచుట్టూ నీటిని ప్రోక్షణ చేయవలెను) అమృతమస్తు అమృతోపస్తరణమసి (అని పళ్ళెములో నీటిని వదలవలెను.)

ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః నైవేద్యం సమర్పయామి. (పండ్లు, కొబ్బరి కాయ, నైవేద్యం పెట్టవలెను.) ఓం ప్రాణాయ స్వాహా, ఓం అపానాయ స్వాహా, ఓం వ్యానాయ స్వాహా, ఓం ఉదానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా. (పదార్థములను దేవికి చూపవలెను) మధ్యేమధ్యే పానీయం సమర్పయామి. అమృతాపిధానమసి, ఉత్తరాపోశనం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి, శుద్ధాచమనీయం సమర్పయామి.



## తాంబూలం

**పూగీఫల సమాయుక్తం నాగవల్లీదళైర్యుతం ।**
**కర్పూరచూర్ణ సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్ ॥**

ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః, తాంబూలం సమర్పయామి.

తాంబూలచర్వణానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి.

## నీరాజనం

**నీరాజనం సమానీతం కర్పూరేణ సమన్వితం ।**
**తుభ్యం దాస్యామ్యహం దేవి గృహ్యతాం స్కందవల్లభే ॥**

సమ్రాజంచ విరాజంచ అభి శ్రీర్యాచనో గృహేలక్ష్మీ రాష్ట్రస్యయా ముఖేత యామాసగ్ం సృజామసి । సంతర శ్రీరస్తు । సమస్త మంగళాని భవంతు । నిత్యశ్రీరస్తు శ్రీ నిత్యమంగళాని భవంతు ॥

ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః, కర్పూరానంద నీరాజనం దర్శయామి.
నీరాజనానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి.

## మంత్రపుష్పం

పీతాముత్పలధారిణీం శచిసుతాం పీతాంబరాలంకృతాం ।
వామే లంబకరాం మహేంద్ర తనయాం మందారమాలాధరాం ॥

దేవైరర్చిత పాదపద్మయుగళాం స్కందస్య వామేస్థితాం ।
సేనాం దివ్యవిభూషితాం త్రినయనాం దేవీం త్రిభంగింభజే ॥

లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీమ్ ।
దాసీభూత సమస్త దేవవనితాం లోకైకదీపాంకురామ్ ॥

శ్రీమన్మంద కటాక్షలబ్ధ విభవబ్రహ్మేంద్ర గంగాధరామ్ ।
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే ముకుంద ప్రియామ్ ॥

ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః, సువర్ణ దివ్య మంత్రపుష్పం సమర్పయామి.





యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ.
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణం పదేపదే
పాపోఽహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః
త్రాహిమాం కృపయా దేవి శరణాగత వత్సలే
అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ
తస్మాత్కారుణ్యభావేన రక్షరక్ష మహేశ్వరి.

ఓం శ్రీ షష్ఠీ దేవ్యై నమః ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.

## పునఃపూజ

ఛత్రం ఆచ్ఛాదయామి. చామరం వీజయామి, నృత్యం దర్శయామి, గీతం శ్రావయామి, ఆందోళికా నారోహయామి అశ్వానారోహయామి, గజానారోహయామి, సమస్త రాజోపచార, శక్త్యోపచార, భక్త్యోపచార, మంత్రోపచార, దేవోపచార, సర్వోపచార పూజాం సమర్పయామి.

**యస్యస్మృత్యాచ నామోక్త్యా తపః పూజా క్రియాదిషు ।**
**న్యూనం సంపూర్ణతాం యాతిసద్యోవందేతమచ్యుతం ।**
**మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరి**
**యత్పూజితం మయాదేవి పరిపూర్ణం తదస్తుతే ।**
**అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయాచ**
**భగవతి శ్రీ షష్ఠీ దేవీ సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు ।**

(అక్షతలు, నీరు పళ్ళెములో వదలవలెను)

**ఓం శ్రీ షష్ఠీ దేవీ ప్రసాదం శిరసా గృహ్ణామి.** పూజాక్షతలు, పుష్పములు తలపై వేసుకోవలెను.



ఏతత్ఫలం శ్రీ షష్ఠీ దేవ్యర్పణమస్తు

## శ్రీ షష్ఠీదేవి వ్రతకథ



పూర్వము తారకాసురుడనే రాక్షసుడు వరగర్వముచే సమస్త లోకాలను పీడించసాగాడు. పార్వతీ పరమేశ్వరుల పుత్రుడైన షణ్ముఖుడు, తారకాసురుని వధించి లోకానికి శాంతిని ప్రసాదించాడు. అప్పుడు దేవతలూ, మహర్షులూ ఆ ఆదిదంపతులను వేనోళ్ళ స్తుతించి "అమ్మా! జగదీశ్వరీ! మీరు శక్తి స్వరూపులు కాబట్టి షణ్ముఖుని కుమారునిగా పొంది తారకాసురుని

నుండి మమ్ములను రక్షించినారు. కానీ మాలాంటి వారి పరిస్థితి ఏమిటి ? మాకు మంచి సంతానమును ప్రసాదించి ఆ సంతానమును చల్లగా కాపాడ డానికి అనుగ్రహా దేవత ఎవరూ లేరు కదా! అట్టి దేవతను మీ వరప్రసాదంగా ముల్లోకాలకు అనుగ్రహించు తల్లీ!" అని ఎన్నోవిధాల ప్రార్థించారు.

వారి ప్రార్థనలను మన్నించిన పార్వతీదేవి, "భక్తులారా! విచారించకండి! త్వరలో మీకు నా ప్రతి రూపమైన ప్రకృతి వలన యీ సృష్టి ఉత్పన్నమవుతోంది. ఆ ప్రకృతి వలన పుట్టిన ఈ సమస్త సృష్టి సంతతినంతటిని కాపాడడానికి ఆ ప్రకృతి యొక్క షష్ఠాంశ, అనగా ఆరవ కళగా దివ్యరూపంతో అవతరించి షష్ఠీదేవి అనే నామంతో విరాజిల్లుతాను. మీ యొక్క సత్సంతానాన్ని కాపాడుతూ, శిశువులను రక్షిస్తూ, వారి బాలారిష్ట దోషాలను నివారిస్తూ వారిని సదా కాపాడుతూ ఉంటుంది. సంతానానికి పరదేవతయై విరాజిల్లుతూ, దేవసేన అనే పేరుతో మా షణ్ముఖుని వివాహమాడి అతనికి అర్థాంగి కాగలదు. ఈ పరదేవతను పూజించిన వారి సంతతి ఎంతో వృద్ధి చెందుతుంది" అని వరమిచ్చి వారందరిని ఆశీర్వదించింది. ఆ వరప్రభావం వల్ల ప్రకృతిమాత షష్ఠాంశ ఒక దివ్య సుందరిగా అవతరించి, గణపతులలో ఒకడైన ధర్మవర్ణి ఇంట దేవసేన అను నామముతో పెరిగి, షణ్ముఖునికి ఇల్లాలైనది.



షణ్ముఖుని వివాహంతో పాటు గణాధిపతి అయిన మహా గణపతికి కూడా వివాహం జరిపించిన పార్వతీ పరమేశ్వరులు విఘ్నాలకు అధిపతిగా ఆ మహాగణపతిని, దేవసైన్యానికి సర్వ సైన్యా ధ్యక్షునిగా షణ్ముఖుని నియమించి లోకాలకు ఆనందం కలిగించారు.

# శ్రీ షష్ఠీదేవి చరిత్ర



స్వాయంభువ మనువు కుమారుడు ప్రియవ్రతుడు అను సార్ధక నామధేయుడు, ఈ సంసార సంబంధములు, బంధకారణ మని తెలుసుకొని గృహస్థాశ్రమం స్వీకరించక అడవులకు పోయి, తపస్సు చేయసాగాడు. కొంత కాలానికి అతనికి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై "ప్రియవ్రతా! నీవు నీ ధర్మాన్ని న్యాయంగా నెరవేర్చు. నీవు గృహస్థాశ్రమం స్వీకరించి, సంసారం సాగించి సంతానం పొంది వానికి రాజ్యం అప్పగించి తపస్సు చేయడం రాజధర్మం. ఆ ధర్మాన్ని నీవు పాటించు అని హితబోధ చేసాడు. అంతట ప్రియవ్రతుడు బ్రహ్మ దేవుడు చెప్పిన విధంగానే మాలతి అనే ఒక క్షత్రియ కన్యను పరిణయ మాడి, దాంపత్య జీవితాన్ని సుఖసంతోషాలతో ఎంతోకాలం అనుభవిస్తూ జీవిస్తున్నాడు. ఈ విధంగా ఎంతకాలమైనా వారికి సంతానం కలుగ లేదు. కశ్యప మహాముని ప్రోత్సాహముతో సంతానం కోరి పుత్ర కామేష్టి యాగము చేసాడు. ఆ యాగ అన్నాన్ని భుజించిన రాజపత్ని మాలతి గర్భవతి అయినది. గర్భవతి అయిన మహారాణికి గర్భం ధరించాననే సంతోషమే తప్ప, ఆ గర్భం దినదిన గండంగా మారింది. ఎంతో బాధతో ఆ గర్భం పది నెలలు మోసింది. అయినా ఆమెకు ప్రసవం కలుగలేదు. రాణి ఆ గర్భాన్ని ఇంకా కొంతకాలం మోయలేక ఆ బాధ భరించలేక తన పిడికిళ్ళతో పొట్టపైన గట్టిగా బాదుకొనగా, ఆమెకు ప్రసవవేదన ఆరంభమై చివరకు ఒక మృత శిశువును కన్నది.

ఆ శిశువు అందచందాలు చూసి ఆమె పడిన ఆవేదన అంతా యింతా కాదు. ఏమిటి నాకీ పరిస్థితి ఎందుకిలా జరిగింది అని కుమిలి కుమిలి ఏడ్చి ఏడ్చి చివరకు సొమ్మసిల్లి పడిపోయినది.

ప్రియవ్రతుడు ఎంతో ఆవేదనకు గురయ్యాడు. లోలోపల కుమిలి పోతూ, ఎందుకిలా జరిగింది అని తీవ్రంగా ఆలోచించి, దుఃఖాన్ని ఆపుకొని గుండె రాయి చేసుకొని ఆ మృత శిశువును భుజాన వేసుకొని శ్మశానానికి వెళ్లి అక్కడ ఆ పార్థివ దేహాన్ని నేలపై పరుండబెట్టి అంతిమ సంస్కారాన్ని జరపడానికి మనస్సు అంగీకరించక చాలాసేపు రోదించాడు. అతని రోదన క్రమంగా దైవనిందా స్థాయికి చేరింది.

"ఓ బ్రహ్మదేవా! నేను వద్దన్నా వినకుండా, తపస్సు చేసుకొనే నన్ను ఈ సంసారకూపంలోకి బలవంతంగా నెట్టావు. నాకీ తీరని దుఃఖం కలిగించడానికేనా ? అమ్మా జగన్మాతా! ఈ ప్రపంచానికి నీవు తల్లివి. తల్లులను గన్న తల్లీ! నీ పాదపద్మాదలను ఆశ్రయించాలని తపస్సు ఆరంభించిన నన్ను యీ భవబంధాల్లో ఎందుకు బంధించావు ? నేను ఏమి పాపం చేశాను ? అయ్యో! నా ఈ ఆవేదన మొరనాలకించే దయామయులు ఒక్కరూ లేరా ? నాకు పుత్రభిక్ష పెట్టే పుణ్యాత్ములు ఈ ధరణిపై లేనే లేరా?" అంటూ విలపిస్తూ వాపోయాడు. అంతలో అక్కడకు ఒక దివ్య విమానములో ఒక దేవత దిగివచ్చి ప్రియవ్రతుని ముందు ఆగినది. ఆ దేవతకు ప్రియవ్రతుడు పాదాభివందనం చేసి "అమ్మా ఎవరు మీరు? మీ తల్లిదండ్రులు ఎవరు? ఎందుకు ఈ ప్రాంతానికి వచ్చారు?" అని అంత బాధలో కూడా సవినయముగా అడిగాడు.

"రాజా! నా పేరు షష్ఠీదేవి. నేను ప్రకృతి మాత షష్టాంశ (6వ అంశ) వల్ల బ్రహ్మ మానస సృష్టిగా అవతరించాను. నేను స్కందుని అర్థాంగిని. నా మరొక పేరు దేవసేన. షష్టీదేవి అని నన్ను ఎక్కువమంది స్మరిస్తారు" అని అన్నది. అంతట ప్రియవ్రతుడు ఆమెకు భక్తితో నమస్కరిస్తూ

"తల్లీ! నువ్వు శిశురక్షకివని పరమేశ్వరి మాత చెప్పింది. శిశుబాలారిష్టాలను బాపు అధిదేవతవని ఆ తల్లి వరమిచ్చింది. నిన్ను పూజించిన వారికి వంశాభివృద్ధి అవుతుందని ఆ జగన్మాత వాక్కు. మరినాకు ఈ దుర్గతి ఏమి తల్లీ! నేనేం అపరాధం చేశాను ? నాకు యీ మృతశిశువును ఎందుకు ప్రసాదించావు ?" అని వాపోయాడు ప్రియవ్రతుడు.

షష్ఠీదేవి మందహాసం చేసి "నాయనా! నీవు సంతానం కోసం పుత్ర కామేష్ఠియాగం చేశావు గానీ, సంతతికి అధిదేవతనయిన నాకు ఆ యాగము నందు ఆవాహన, స్థాన, ఆసన, నివాసాలు కల్పించ లేదు. యజ్ఞపురుషుడినీ, దిక్పాలకులనూ ఆవాహన చేసిన నీవు కనీసం నా పేరు కూడా తలచలేదు. మరి నీ శిశురక్షణకి నేనెలా బాధ్యత వహిస్తాను?" అని ప్రశ్నించింది. ప్రియవ్రతుడు తన పొరపాటు గ్రహించి "అమ్మా! షష్ఠీదేవీ! నా అపరాధాన్ని క్షమించు. ఇప్పుడే, ఇక్కడే నిన్ను పూజిస్తాను. నీ వ్రతవిధానం చెప్పు" అని ప్రార్థించాడు.

**వ్రతవిధానం :** "నాయనా! ప్రకృతి పరదేవతా అవతారమైన నన్ను, ఆ ప్రకృతి నుండి పుట్టిన మర్రివృక్షము మొదలు యందుగానీ మట్టినుండి రూపొందిన కుండపైన గానీ, మట్టితో నిర్మించిన గోడపైన గానీ, లేదా మట్టికి ప్రతిరూపమైన సాలగ్రామంపై గానీ నా ప్రతిమను ఉంచి పూజించిన వారియెడల నేను ప్రసన్నురాలినై వారి అభీష్టాలు తీరుస్తాను. వారికి సత్సంతానాన్ని అనుగ్రహిస్తాను. నా అనుగ్రహం పొందిన బిడ్డలు దీర్ఘాయుష్మలై ఆరోగ్య భోగభాగ్యాలతో ఈ ధరణి యందు వర్ధిల్లుతారు" అని తెలిపింది షష్ఠీదేవి. "తల్లీ! ఈ మృత శిశువు నా కుమారుడు. ఇతడు మృతి చెందియే జన్మించాడు. ఈ విషయం తెలిసి ఏడ్చి ఏడ్చి నా భార్య మూర్ఛపోయినది. ఆ తల్లి కడుపుకోతను తీర్చు తల్లీ" అని చేతులు జోడించి ప్రాధేయపడ్డాడు. ప్రియవ్రతుడి ప్రార్థనతో కనికరించిన షష్ఠీదేవి తన శక్తితో పిల్లవానిని బ్రతికించి



ప్రియవ్రతుడికి ఇస్తూ "ఇతని పేరు సువ్రతుడు, అప్రమేయమైన బల పరాక్రమాలతో ఈ భూమిని ఏకచ్ఛత్రంగా పాలిస్తాడు, నూరు యజ్ఞ యాగాలు చేస్తాడు. వేదం చెప్పిన రీతిగా నన్ను నీ ఇంట ఆరాధిస్తూ, నీ రాజ్యంలోని ప్రజల చేత కూడా ఆరాధింపచేస్తూ ఉండు. నీకు అంతా మంచి జరుగుతుంది అని దీవించి అంతర్ధానమైనది.

ప్రియవ్రతుడు పరమానందముతో కుమారునితో కలిసి ఇంటికి వచ్చి షష్ఠీదేవి యొక్క కథ చెప్పి, తన భార్యతో కలిసి వేదోక్త విధానముగా ఆ షష్ఠీదేవిని ఆరాధించాడు. తరువాత ఆ విధంగా ఆరాజ్యం, ఆరాజ్యంలోని ప్రజలు ఎలాంటి యిబ్బందులు లేకుండా సుఖసంతోషాలతో చిరకాలం జీవించారు. ప్రజల చేత కూడా షష్టీ దేవి యొక్క వ్రతాలు పూజలు చేయించినాడు.

పురుటింట ఆరవరోజున షష్టీదేవి పూజ చేస్తే పురుటితల్లికి,పుట్టిన శిశువుకు ఎంతో క్షేమదాయకం. అలాగే పురిటి శుద్దినాడు కూడా ఈ పూజ చేయించడం చాలా మంచిది. అన్నప్రాశన సమయములో కూడా చేయడం వలన పురిటి దోషాలు, బాలారిష్ట దోషములు తొలగి శిశువు పూర్ణాయుర్దాయము కలిగి దినదినాభివృద్ధి చెందుతాడు.

సంతానం కోరి షష్టీదేవిని పూజించి నిత్యం ఈ స్తోత్రము భక్తి శ్రద్ధలతో పఠిస్తూ వుంటే శుభ లక్షణాలతో, దీర్ఘాయుష్మంతులు అయిన సంతానం కలుగుతుంది. చిన్న వయసులో ఉన్న పిల్లలు భయపడి ఏడుస్తూ వున్నప్పుడూ, పురిటి ఇంట ఈ స్తోత్రం పఠిస్తే అన్ని బాధలు పోయి, పిల్లలు సుఖముగా, సురక్షితముగా వుంటారు. షష్ఠీ దేవి అనుగ్రహము వలన అన్ని రకాలైన బాల గ్రహదోషాలు, పీడలు తొలగిపోతాయి. సుఖశాంతులతో వర్ధిల్లుతారు.

ఓం శ్రీ సుబ్రహ్మణ్య కుటుంబిన్యై నమః

శ్రీ షష్ఠీదేవి చరిత్ర సమాప్తం

## ఉద్వాసన

యజ్ఞేన యజ్ఞ మయయజన్తదేవాః తానిధర్మాణి ప్రథమాన్యాసన్ ।
తేహనాకం మహిమాన స్సచంతే యత్రపూర్వే సాధ్యాస్సంతిదేవా ॥

శ్రీ షష్ఠీ దేవ్యై నమః యథాస్థానం ప్రవేశయామి. శోభనార్థం పునరాగమనాయచ. (కలశమును తూర్పునకు కదుపవలయును)



## శ్రీ షష్ఠీదేవి ధ్యానం

శ్రీమన్మాతరం అంబికాం విధి మనోజాతాం సదాభీష్టదాం ।
స్కందేష్టాం చ జగత్ప్రసూం విజయదాం సత్పుత్ర సౌభాగ్యదాం ।
సద్రత్నాభరణాన్వితాం సకరుణాం శుభ్రాం శుభాం సుప్రభాం ।
షష్ఠాంశాం ప్రకృతేః పరాం భగవతీం శ్రీ దేవసేనాం భజే ॥

షష్ఠాంశాం ప్రకృతేః శుద్ధాం సుప్రతిష్ఠాం చ సువ్రతాం ।
సుపుత్రదాం చ శుభదాం దయారూపాం జగత్ప్రసూం ।
శ్వేతచంపక వర్ణాభాం రక్తభూషణ భూషితాం ।
పవిత్రరూపాం పరమాం దేవసేనాం పరాంభజే ॥

# శ్రీ షష్ఠీ దేవి స్తోత్రం

నమోదేవ్యై మహాదేవ్యై సిద్ధ్యై శాన్త్యై నమో నమః
శుభాయై దేవసేనాయై షష్ఠీదేవ్యై నమో నమః ॥ 1
వరదాయై పుత్రదాయై ధనదాయై నమో నమః
సుఖదాయై మోక్షదాయై చ షష్ఠీదేవ్యై నమో నమః ॥ 2
సృష్ట్యై షష్ఠాంశరూపాయై సిద్ధాయై చ నమో నమః
మాయాయై సిద్ధయోగిన్యై షష్ఠీదేవ్యై నమో నమః ॥ 3
సారాయై శరదాయై చ పరాదేవ్యై నమో నమః
బాలాధిష్ఠాతృదేవ్యై చ షష్ఠీదేవ్యై నమో నమః ॥ 4
కల్యాణదాయై కల్యాణ్యై ఫలదాయై చ కర్మణామ్
ప్రత్యక్షాయై చ భక్తానం షష్ఠీదేవ్యై నమో నమః ॥ 5
పూజ్యాయై స్కందకాంతాయై సర్వేషాం సర్వకర్మసు
దేవరక్షణకారిణ్యై షష్ఠీదేవ్యై నమో నమః ॥ 6
శుద్ధసత్త్వ స్వరూపాయై వందితాయై నృణాం సదా
హింసాక్రోధవర్జితాయై షష్ఠీదేవ్యై నమో నమః ॥ 7
ధనం దేహి ప్రియం (ప్రియాం) దేహి పుత్రందేహి సురేశ్వరి
ధర్మం దేహి యశోదేహి షష్ఠీదేవ్యై నమో నమః ॥ 8
మానందేహి జయందేహి దిషోజహి మహేశ్వరి
భూమిం దేహి ప్రజాందేహి విద్యాందేహి సుపూజితే
కల్యాణం చ జయందేహి విద్యాదేవ్యై నమోనమః ॥ 9

## ఫలశ్రుతి

ఇతి దేవీం చ సంస్తుత్య లభే పుత్రం ప్రియవ్రతం
యశశ్వినం చ రాజేంద్రం షష్ఠీదేవి ప్రసాదతః ॥ 10

షష్ఠీ స్తోత్ర మిదం బ్రహ్మన్ యః శృణోతి వత్సరం
అపుత్రో లభతే పుత్రమ్ వరం సుచిర జీవనం ॥ 11

వర్షమేకం చ యాభక్త్యాసంస్తుత్యేదం శృణోతి చ
సర్వపాప వినిర్ముక్తా మహావంధ్యా ప్రసూయతే ॥ 12

వీరం పుత్రం చ గుణినం విద్యావన్తం యశస్వినం
సుచిరాయుష్యవన్తం చ సూతే దేవి ప్రసాదతః ॥ 13



కాక వంధ్యా చ యానారీ మృతపత్యా చ యా భవేత్
వర్షం శృత్వా లభేత్పుత్రం షష్ఠీ దేవీ ప్రసాదతః ॥ 14

రోగయుక్తే చ బాలే చ పితామాతా శృణోతి చేత్
మాసేన ముచ్యతే రోగాన్ షష్ఠీ దేవీ ప్రసాదతః ॥ 15

జయదేవి జగన్మాతః జగదానందకారిణి
ప్రసీద మమ కళ్యాణి నమస్తే షష్ఠి దేవతే ॥ 17

శ్రీ షష్ఠీ దేవి స్తోత్రం సంపూర్ణం

సంతానం కోరుకునే స్త్రీ పురుషులు సంతానం కోరి (పుత్రిక, పుత్రుడు) ఈ షష్ఠీదేవిని భక్తి శ్రద్ధలతో పై స్తోత్రంతో నిత్యం పూజించాలి. ఆ దేవి కరుణా కటాక్షాలతో అందమైన, ఆరోగ్యవంతమైన సంతానం కల్గుతుంది. శుభ లక్షణాలతో పెరిగి ఆరోగ్యవంతులుగా జీవిస్తారు.

# శౌనక మహర్షి విరచిత శ్రీ గర్భరక్షా స్తోత్రం

ఓం శ్రీ గణేశాయ నమః ఓం శ్రీమాత్రే నమః

ఏహ్యేహి భగవాన్ బ్రహ్మాన్ ప్రజా కర్తా, ప్రజా పతే
ప్రగృహ్ణీవ బలిం చ ఇమం ఆపత్యాం రక్ష గర్భిణీమ్.॥ 1

అశ్వినీ దేవ దేవేసౌ ప్రగృహ్ణీతమ్ బలిం ద్విమం
సాపత్యాం గర్భిణీమ్ చ ఇమం చ రక్షతాం పూజ యనయా ॥ 2

రుద్రాశ్చ ఏకాదశ ప్రోక్తా ప్రగృహనంతు బలిం ద్విమం
యుష్మాకం ప్రీతయే వృతం నిత్యం రక్షతు గర్భిణీమ్.॥ 3

ఆదిత్య ద్వాదశ ప్రోక్తా ప్రగ్రహ్ణీత్వం బలిం ద్విమం
యుష్మాగం తేజసాం వృధ్య నిత్యం రక్షత గర్భిణీమ్. ॥ 4

వినాయక గణాధ్యక్షా శివ పుత్రా మహా బల
ప్రగ్రహ్ణీష్వ బలిం చ ఇమం సపత్యాం రక్ష గర్భిణీమ్. ॥ 5

స్కంద షణ్ముఖ దేవేశా పుత్ర ప్రీతి వివర్ధన
ప్రగ్రహ్ణీష్వ బలిం చ ఇమం సపత్యాం రక్ష గర్భిణీమ్. ॥ 6

ప్రభాస, ప్రభవశ్యామా ప్రత్యూషో మరుత నల
దృవూ ధురా ధురశ్చైవ వసవోష్టా ప్రకీర్తితా
ప్రగ్రహ్ణీత్వం బలిం చ ఇమం నిత్యం రక్ష గర్భిణీమ్. ॥ 7

పితుర్ దేవీ పితుశ్రేష్టే బహు పుత్రీ మహా బలే
భూత శ్రేష్టే, నిశావాసే నిర్వృతే, శౌనక ప్రియే
ప్రగ్రహ్ణీష్వ బలిం చ ఇమం సపత్యాం రక్ష గర్భిణీమ్. ॥ 8

రక్ష రక్ష మహాదేవ, భక్తానుగ్రహకారక
పక్షి వాహన గోవిందా సపత్యాం రక్ష గర్భిణీమ్. ॥ 9

ఈ స్తోత్రమును ప్రతీరోజూ పూజా మందిరంలో, అమ్మవారికి కొంచెం

పళ్ళు, పాలు లేదా ఏదైనా తీపి పదార్థం నివేదన చేసి, ఈ గర్భరక్షా స్తోత్రం ఈ క్రింద తెలిపిన విధంగా చదువుకోవాలి.

**2వ నెలలో, మొదటి రెండు శ్లోకములు రోజూ 108 సార్లు**
**3వ నెలలో, మొదటి మూడు శ్లోకములు రోజూ 108 సార్లు**
**4వ నెలలో, మొదటి నాలుగు శ్లోకములు రోజూ 108 సార్లు**
**5వ నెలలో, మొదటి ఐదు శ్లోకములు రోజూ 108 సార్లు**
**6వ నెలలో, మొదటి ఆరు శ్లోకములు రోజూ 108 సార్లు**
**7వ నెలలో, మొదటి ఏడు శ్లోకములు రోజూ 108 సార్లు**
**8వ నెలలో, మొదటి ఎనిమిది శ్లోకములు రోజూ 108 సార్లు**
**9వ నెలలో, మొదటి తొమ్మిది శ్లోకములు రోజూ 108 సార్లు**

గమనిక : సమయం అనుకూలించనివారు 9సార్లు కూడా పఠించవచ్చును. శుభ ఫలితాలు పొందుతారు. మంచి సంతానం కలగాలని శ్రీ షష్ఠీదేవిని భక్తితో ప్రార్థిస్తూ పై శ్లోకాలు పఠించి శుభఫలితాలు పొందగలరు.



# శ్రీ షష్ఠీ దేవీ స్తోత్రం

**సుపుత్ర దంచశుభదం దయరూపం జగత్ ప్రసు**
**శ్వేతచంపక వర్ణభం రత్నభూషణ భూషితం**
**పవిత్ర రూపం పరమం దేవీసేనం పరం భజే.**

**ప్రియపుత్ర ఉవాచ**

**నమోదేవ్యై మహాదేవ్యై సిద్ధిశాంత్యై నమోనమః**
**శుభాయై దేవసేనాయై షష్ఠీదేవ్యై నమోనమః 1**

**వరదాయై, పుత్రదాయై, ధనదాయై నమోనమః**
**సుఖదాయై మోక్షదాయై షష్ఠిదేవ్యై నమోనమః 2**

**సృష్ట్యై షష్ఠాంశస్వరూపాయై సిద్ధాయై చ నమోనమః**
**మాయాయై సిద్ధయోగిన్యై షష్ఠిదేవ్యై నమోనమః 3**

సారైయ్యై, శారదాయై చ పరాదేవ్యై నమోనమః
బలాధిష్ఠాతృ దేవ్యై చ షష్ఠి దేవ్యై నమోనమః 4
కల్యాణాదాయ్యై కల్యాణ్యై ఫలదాయై చ కర్మణాం
ప్రత్యక్షాయై సర్వభక్తానాం షష్ఠిదేవ్యై నమోనమః 5
పూజ్యాయై స్కంధకాంతాయై సర్వేశాం సర్వకర్మసు
దేవరక్షణ కారిణ్యై షష్ఠిదేవ్యై నమోనమః 6
శుద్ధసత్త్వ స్వరూపాయై, వందితాయై నృణాం సదా
హింసాక్రోధ వర్జితాయై, షష్ఠిదేవ్యై నమోనమః 7
ధనందేహి ప్రియందేహి, పుత్రాన్‌దేహి సురేశ్వరి
మోక్షందేహి జయందేహి, ద్విషోదేహి మహేశ్వరి
ధర్మందేహి యశోదేహి షష్ఠిదేవ్యై నమోనమః 8
దేహి భూమిం, ప్రజాందేహి విద్యాందేహి సుపూజితే
కళ్యాణం చ జయిందేహి షష్ఠిదేవ్యై నమోనమః 9
ఇది దేవీంచ సంసుత్మోలేఖే పుత్రం ప్రియ పుత్ర
యశిస్మినం చ రాజేంద్రం షష్ఠిదేవి ప్రసాదత 10
షష్ఠిస్తోత్రం ఇదం బ్రహ్మ య శృణోతి చ వత్సరం
అపుత్రో లభతే పుత్రాన్ వరం సుచిర జీవనం 11
వర్షమేకంచ యోభక్త్య సంపూజం శృణోథిచ
సర్వపాప వినిర్ముక్తో మహావంధ్యా ప్రసూయతే 12
వీరపుత్రం చ గుణీనం, విద్యావంతం యశశ్మినం
సుచిర్ ఆయుష్యన్త్రచ షష్ఠిమాతృ ప్రసాదితత్ 13

శ్రీ సుబ్రహ్మణ్య వివృత పురాణే, శ్రీ ప్రియపుత్ర విరచిత శ్రీ షష్ఠిదేవీ స్తోత్రం సంపూర్ణం

ఇది దేవి పురాణం 9వ స్కంధంలో చెప్పబడింది. ●